28800 సం॥ల నాటిదిగా అభిప్రాయపడిరిగాని దాని కితర సాక్షి సాధనములు లేవు. సృష్ట్యాదినుండి సైన నుడివిన విషువత్ పరిభ్రమణము లెన్ని ముగిసి యెంత కాలము నిజముగా జరిగెనో సరియైన నిర్ధారణయగుటకు వీలు లేకున్నను మన గణిత గ్రంథాలలో సృష్ట్యాది యీభూగోళమునకు 195 కోట్ల సం॥లు జరిగినట్లు చెప్పబడినది. దానిని నమ్మదమన్నచో నప్పటి కాలపు మనువు లొక్కొక్కరే కొన్ని వేల సం॥లు (71 మహాయుగములు) జీవించినట్లుగా వ్రాయబడుటవల్ల యసంగతవిషయమైనది. అప్పటినుండి మనకు చరిత్ర యుండుటగూడ నమ్మ శక్యముగానిది. మనుస్మృతిలో కృతయుగమందు మానవజీవితము 400 సం॥లుగాను. తక్కిన యుగములలో వరుసగా నాల్గవవంతు తగ్గి క్రమముగా 300, 200, 100 సం॥ల పరిమాణమని క్రింద శ్లోకమున జెప్పబడినది.

శ్లో॥ అరోగా స్సర్వ సిద్ధార్థా శ్చతుర్వర్ష శతాయుషః
కృతే త్రేతాదిషు హ్యేషామాయుర్హ్రసతి పాదశః॥

(అధ్యా 1—83)

ఈశావాస్యోపనిషత్తులోను, మరికొన్ని యితర యుపనిషత్తులలో గూడ 100 సం॥ల యాయుర్దాయమే నరులకు విధింపబడినది. జ్యోతిషశాస్త్రరీత్యా గూడ పరమాయుర్దాయము 120 సం॥లే. వేదవాక్కులలో చాల చోట్ల "శతాయుః పురుష" యనియే నుడువబడెను. వీని కన్నిటికిని విరుద్ధముగా మనువులు, మరికొందరు రాజులును వేలు, లక్షల సంవత్సరములు జీవించిరని వ్రాసిన పూర్వగాథలు గణితశాస్త్రములందున్నను మరియెచ్చట నున్నను పాటించరానివగుచున్నవి. ఇట్టి విషయము లనేకము మన పురాణములందు వ్రాయబడినవి.

## కాలజ్ఞానము - భారతయుద్ధకాలము

ఈ పురాణములలోని అంకెలను నమ్మినచో మొదటి మనువు మొదట 453 మహాయుగములును, 8 యుగములును అనగా మొత్తము 1815 యుగములు ఇదివరలో జరిగియున్నట్లు మనము విశ్వసింపవలయును. ఇవి 195 కోట్ల సం॥లకు దాటుచున్నవి. ఇవియన్నియు యెరిగినట్లే వారి పాలకులతో



గూడ పురాణములు చెప్పినవనవలెను. ఇది సామాన్య మానవసృష్టికేగాక లోకమునగల సర్వమానవ ప్రపంచ విజ్ఞానకాలమునకు చాల దూరముగా నున్నదిగాన సందేహింపవలసియున్నది. ఇంతలి బూటకమేమిరో క్రమముగా విచారింతము. కాని మనకు ఖగోళ గణితశాస్త్రజ్ఞుల లెక్కప్రకారము పంచాంగములలో యీ 1815 యుగములలో 7 యుగముల ఆద్యంతములు మాత్రమే చెప్పుచున్నారు. 8 వది కలి ఆరంభముగూడ జెప్పుదురు. పంచాంగములలో వాని ఆద్యంతము లీ క్రిందివిధముగ నున్నవి.

| | | | | |
|---|---|---|---|---|
| 1. కృతయుగము | ఆరంభం | కార్తీక శు ౯ | అంతం | శ్రావణ శు 3 |
| 2. త్రేతాయుగము | ,, | శ్రావణ శు 3 | ,, | మాఘ బ 30 |
| 3. ద్వాపరయుగము | ,, | మాఘ బ 30 | ,, | భాద్రపద బ౧౨ |
| 4. కలియుగము | ,, | భాద్రపద బ ౧౨ | ,, | మాఘ శు ౭ |
| 5. కృతయుగము | ,, | మాఘ శు ౭ | ,, | వైశాఖ శు 3 |
| 6. త్రేతాయుగము | ,, | వైశాఖ శు 3 | ,, | కార్తీక శు ౧౫ లేక బ ౧౨ |
| 7. ద్వాపరయుగము | ,, | కార్తీక శు ౧౫ లేక బ ౧౨ | ,, | వైశాఖ బ ౧౦ |
| 8. కలియుగము | ,, | వైశాఖ బ ౧౦ | ,, | ? |

వీనిలో చివరి కలియుగారంభమున భారతయుద్ధ, శ్రీకృష్ణ నిర్యాణములు జరిగెనని పురాణములందు గలదు. భారతయుద్ధమై కలియుగ ప్రవేశమైన పిమ్మట 25 సం॥లకు ధర్మరాజు చనిపోగా నాయన పేరిట సప్తర్షులు తిరుగు దానినిబట్టి యొక శకమేర్పడెనని చెప్పుదురు. సప్తర్షు లొక్కొక్క నక్షత్రమునందు నూరు సం॥లు ఉందురనియు అన్ని నక్షత్రములు తిరుగుటకు 2700 సం॥లు పట్టుననియు. నదియొక శకమనియు పురాణములు వాకొనుచున్నవి. నేటికి కలియుగము లెక్క 5047 అనియు, క్రీ. పూ. 3102 సం॥లోనే కలియుగారంభమైనట్లు మన గణితశాస్త్రములు చెప్పుచున్నవి. సూర్యసిద్ధాంతములోని విషయములనుబట్టి యిది రూఢిపడుచున్నది. గాని ఈ సప్తర్షిశకమును యీ కలియుగ సంఖ్యలును యిటీవలివా రెవ్వరో కల్పించిరనియు,